# అథ అష్టచత్వారింశో%ధ్యాయః

## శుంభ నిశుంభ వధ

రాజోవాచ |

ధూమ్రాక్షం చండముండం చ రక్తబీజాసురం తథా | భగవన్నిహతం దేవ్యా శ్రుత్వా శుంభస్సురార్దనః || 1

కిమకార్షీత్తతో బ్రహ్మన్నేతన్మే బ్రూహి సాంప్రతమ్ | శుశ్రూషవే జగద్యోనేశ్చరిత్రం పాపనాశనమ్ || 2

రాజు ఇట్లు పలికెను -

ఓ పూజ్యా ! ధూమ్రాక్ష - చండ-ముండ- రక్తబీజాసురులు సంహరింపబడినారని విని దేవపీడకుడగు శుంభుడు అపుడు ఏమిచేసెను ? ఓ పూజ్యా ! జగన్మాతయొక్క పాపనాశకమగు చరితమును నేను వినగోరుచున్నాను. కావున ఇపుడు నాకు ఈ విషయమును చెప్పుడు (1, 2).

ఋషిరువాచ |

హతానిమాన్ దైత్యవరాన్మహాసురో నిశమ్య రాజన్మహనీయవిక్రమః |

అజిజ్ఞపత్ స్వీయగణాన్ దురాసదాన్ రణాభిధోచ్చారణజాతసంమదాన్ || 3

బలాన్వితాస్సంమిలితా మమాజ్ఞయా జయాశయా కాలకవంశసంభవా ః |

సకాలకేయాసురమౌర్య దౌర్హృదాస్తథా పరేప్యాశు ప్రయాణయంతు తే || 4

నిశుంభశుంభౌ దితిజాన్నిదేశ్య తాన్ రథాధిరూఢౌ నిరయాంబభూవతుః |

బలాన్యనూఖుర్బలినోస్తయోర్ధరాద్వినాశవంతశ్శలభా ఇవోత్థితాః || 5

ప్రసాదయామాస మృతంగమర్దలం సభేరికాడిండిమఝుర్ఝ రానకమ్ |

రణస్థలే సంజహృషూ రణప్రియా అసుప్రియాస్సంగరతః పరాయయుః || 6

భటాశ్చ తే యుద్ధపటావృతాస్తదా రణస్థలీమాపురపాపవిగ్రహాః |

గృహీత శస్త్రాస్త్రచయా జిగీషయా పరస్పరం విగ్రహయంత ఉల్బణమ్ || 7

గజాధిరూఢాస్తురగాధిరోహిణో రథాధిరూఢాశ్చ తథాపరే%సురాః |

అలక్షయంతస్స్వపరాన్ జనాన్మదా%సురేశసంగే సమరే%భిరే భిరే || 8

ధ్వనిశ్శతఘ్నీజనితో ముహుర్ముహుర్బభూవ తేన త్రిదశాస్సమేజితాః |

మహాంధకారస్సమపద్యతాంబరే విలోక్యతే నో రథమండలం రవేః || 9

పదాతయో నిర్వరజుర్హి కోటిశః ప్రభూతమానా విజయాభిలాషిణః|

రథాశ్వగా వారణగా అథాపరే%సురా నిరీయుః కతి కోటిశో ముదా || 10

అశుక్లశైలా ఇవ మత్తవారణా అతానిషుశ్చీత్కృతిశబ్దమాహవే |

క్రమేలకాశ్చాపి గలద్గలధ్వనిం వితన్వతే క్షుద్రమహీధరోపమాః || 11

హయశ్చ హ్రేషంత ఉదగ్రభూమిజా విశాలకంఠాభరణా గతేర్విదః |

పదాని దంతావల మూర్ధ్ని బిభ్రత స్సుడిడ్యిరే వ్యోమపథా యథా%వయః || 12

ఋషి ఇట్లు పలికెను -

ఓ రాజా ! గొప్ప పరాక్రమశాలియగు ఆ మహారాక్షసుడు ఈ రాక్షసశ్రేష్ఠుల సంహారమును గురించి విని, జయింప శక్యము కానివారు, యుద్ధము అనే పేరు వినగానే ఉదయించే గొప్ప గర్వము గలవారు అగు తన గణముల నాజ్ఞాపించెను (3).
కాలకవంశమునందు పుట్టిన రాక్షసులు, మౌర్యులు, దౌర్హృదులు మాత్రమే గాక, ఇతరవంశముల రాక్షసులు కూడ నా ఆజ్ఞచే సైన్యములతో సహా సన్నద్ధులై వెంటనే ఒకచోటకు చేరి శత్రువులను జయించ వలెననే ఉత్సాహముతో ప్రయాణమును చేయుదురు గాక ! (4) శుంభనిశుంభులు ఈ విధముగా రాక్షసుల నాదేశించి తాము రథములనధిష్ఠించి బయలుదేరిరి. పర్వతమునుండి పైకి లేచి నిప్పుల గుండములోనికి ఉరికే మిడతలవలె ఆ సేనలు బలశాలురగు ఆ ఇద్దరు రాక్షసుల వెనుక వినాశాభిముఖముగా అనుసరించినవి (5). మద్దెలలు, డోళ్లు, భేరీలు, డిండిమములు, ఝర్ఝ రములు (క్రైమళ్లు), ఆనకములు మ్రోయించబడినవి. ఆ యుద్ధరంగములో యుద్ధప్రియులకు మహానందము కలుగుచుండెను. కాని, ప్రాణములయందు తీపి గలవారు యుద్ధము నుండి పలాయనమును చిత్తగించిరి (6). భటులు యుద్ధమునకు తగిన వస్త్రములను దాల్చి శస్త్రాస్త్ర సమూహములను పట్టుకొని పవిత్రమగు యుద్ధోద్యమము గలవారై రణరంగమునకు చేరుకొనిరి. వారు ఒకరినొకరు జయించవలెననే తీవ్రమగు స్పర్ధను కలిగియుండిరి (7). రాక్షసులు ఏనుగులను, గుర్రములను, రథములను ఎక్కి ముందుకు సాగిరి. మరికొందరు కాలినడకతో వచ్చుచుండిరి. వారు ఆనందముచే స్వపర పక్షముల భేదమును కనలేకుండిరి. వారు యుద్ధములో ఆ రాక్షసాధీశ్వరుల సమక్షములో చాల ప్రకాశించిరి (8).
శతఘ్నులనుండి పలుమార్లు బయల్వెడలుచున్న ధ్వనిని విని దేవతలు అధికముగా కంపించుచుండిరి. ఆకాశములో దట్టమగు చీకటి నెలకొనెను. సూర్యమండలము కానవచ్చుట లేదు (9). పదాతి సైన్యములు మాత్రమే గాక, రథములను, గుర్రములను, ఏనుగులను అధిష్ఠించియున్న రాక్షసులు కోట్ల సంఖ్యలో ఆనందముతో ఉప్పొంగుచున్నవారై విజయమును పొందవలెననే పట్టుదలతో

ముందుకు సాగుచుండిరి (10). నల్లని పర్వతముల వలెనున్న మదించిన ఏనుగులు యుద్ధములో ఛీత్కార శబ్దమును అధికముగా అంతటా వ్యాపింప జేసినవి. చిన్న పర్వతములను పోలియున్న ఒంటెలు కూడ అంతటా గలగల ధ్వని నిండునట్లు చేసినవి (11). వీరభూములయందు జన్మించి పరుగెత్తుటలో నేర్పరులైన గుర్రములు తమ మెడలలో విశాలమగు ఆభరణములు గలవై సకిలించుచూ తమ గిట్టలను ఏనుగుల తలలపై మోపి పక్షులవలె ఆకాశమార్గములో ఎగురుచుండెను (12).

సమీక్ష్య శత్రోర్బలమిత్థమాపతచ్చకార సజ్యం ధనురంబికా తదా |

ననాద ఘంటాం రిపుసాదదాయినీం జగర్జ సింహో%పి సటాం విధూనయన్ || 13

తతో నిశుంభస్తుహినాచలస్థితాం విలోక్య రమ్యాభరణాయుధాం శివామ్ |

గిరం బభాషే రసనిర్భరాం పరాం విలాసినీ భావవిచక్షణో యథా || 14

భవాదృశీనాం రమణీయవిగ్రహే దునోతి కీర్ణం ఖలు మాలతీదలమ్ |

కథం కరాలాహవమాతనోష్యసే మహేశి తేనైవ మనోజ్ఞవర్ష్మణా || 15

ఇతీరయిత్వా వచనం మహాసురో బభూవ మౌనీ తమువాచ చండికా |

వృథా కిమాత్థాసుర మూఢ సంగరం కురుష్వ నాగాలయమన్యథా వ్రజ || 16

తతో%తిరుష్టస్సమరే మహారథశ్చకార బాణావలి వృష్టిమద్భుతామ్ |

ఘనాఘనాస్సంవవృషుర్య థోదకం రణస్థలే ప్రావృడివా గతా తదా || 17

శ##రైశ్శితైశ్శూలపరశ్వధాయుధైస్సంభిందిపాలైః పరిఘైశ్శరాసనైః |

భుశుండికా ప్రాసక్షురప్రసంజ్ఞకైర్మహాసిభిస్సంయుయుధే మదోద్ధతైః || 18

విబభ్రముస్తత్సమరే మహాగజా విభిన్నకుంభా అసితాద్రిసన్నిభాః |

చలద్వలాకాధవలా వికేతవో విసేతవశ్శుంభనికుంభ##కేతవః || 19

విభిన్నదేహా దితిజా ఝుషోపమా వికంధరా వాజిగణా భయంకరాః |

పరాసవః కాలికయా కృతా రణ    మృగారిణా చాశిపతాపరే%సురాః || 20

విసుస్రువూ రక్తవహాస్తదంతరే సరిచ్చయాస్తత్ర విప్లువే హతైః |

కచా భటానాం జలనీలికోపమాస్తదుత్తరీయం సితఫేన సన్నిభమ్ || 21

తురంగసాదీ తురగాధిరోహిణం గజస్థితానభ్యపతన్ గజారుహాః |

రథీ రథేశం ఖలు పత్తి రంఘ్రిగాన్ సమప్రతిద్వంద్వికలిర్మహానభూత్ || 22

తతో నిశుంభో హృదయే వ్యచింతయత్క
రాలకాలో%యముపాగతో%ధునా |

భ##వేద్దరిద్రో%పి మహాధనో మహాధనో దరిద్రో విపరీతకాలతః || 23

అపుడు ఈ విధముగా వచ్చి పడుచున్న శత్రుసేనలను గాంచి అంబిక ధనస్సుపై నారిత్రాటిని ఎక్కించి, శత్రువులకు దుఃఖమునిచ్చే ఘంటను మ్రోగించెను. సింహము కూడ జూలును విదల్చి గర్జించెను (13). అపుడు నిశుంభుడు హిమవత్పర్వతముపై నున్న శివాదేవిని చూచెను. ఆమె అందమగు ఆభరణములను, ఆయుధములను ధరించియుండెను. ఆతడు సుందరయువతుల మనోగతమునెరింగిన దిట్టవలె ఆమెను ఉద్దేశించి మాధుర్యముతో నిండియున్న శ్రేష్ఠమగు వచనమును పలికెను (14). ఓ సుందరాంగీ ! మల్లెపూవులను

విసరిననూ నీ వంటి వారల దేహము కందిపోవును. నీవు ఈ మనోహరమగు దేహముతో సర్వసమర్ధుడగు శత్రువునకు ఎదురుగా భయంకరమగు యుద్ధమును ఎట్లు చేయగల్గుదువు ? (15) ఆ గొప్ప రాక్షసుడు ఇట్లు పలికి మిన్నకుండగా, చండిక వానితో నిట్లనెను : ఓ మూర్ఖ రాక్షసుడా ! వ్యర్ధమగు మాటలను పలుకుచుంటివేల? యుద్ధమును చేయుము. లేదా, పాతాళమునకు పొమ్ము (16). అపుడు మహారథుడగు ఆ రాక్షసుడు మిక్కిలి కోపించి బాణపరంపరలను అద్భుతమగు వర్షముగా కురిపించెను. దట్టని మేఘములు జలధారలను వర్షించుచున్నవా యన్నట్లు బాణములు పడెను. ఆ సమయములో యుద్ధరంగమునకు వర్షకాలము వచ్చినదా యన్నట్లుండెను (17). బలముచే గర్వించియున్న అనుచరులతో గూడి ఆ రాక్షసుడు వాడి బాణములను, శూలములు మరియు గొడ్డళ్లు అను ఆయుధములను, భిందిపాలములను, పరిఘలను, భుశుండములను, ప్రాసలను, చురికలను, పెద్దకత్తులను వాడుతూ, ధనస్సుల నుండి బాణములను ప్రయోగిస్తూ గొప్ప యుద్ధమును చేసెను (18). ఆ యుద్ధములో నల్లని పర్వతముల వలెనున్న పెద్ద ఏనుగులు పగిలిన కుంభస్థలములు గలవై ఇటునటు తిరుగాడుచుండెను. శుంభనిశుంభుల తెల్లని ధ్వజములు హద్దులను దాటి కొంగలవలె రెపరెప లాడినవి (19). యుద్ధములో కాలిక రాక్షసుల దేహములను చేపలను వలె చీల్చి తలలను మొండెములనుండి వేరు చేసెను. ఆమెచే సంహరింపబడిన గుర్రముల గుంపులు భయమును గొల్పెను. సింహము కూడ మరికొందరు రాక్షసులను భక్షించెను (20). యుద్ధరంగ మధ్యభాగములో రక్తపుఏరులు పారెను. మరణించిన యోధుల దేహములు వాటిలో తేలియాడుచుండెను. భటుల కేశములు నీటి నాచును, వారి ఉత్తరీయములు తెల్లని నురగను పోలియుండెను (21). గుర్రపు జోదు గుర్రపు జోదుతో, ఏనుగుపై నున్న వీరుడు మరియొక అట్టి వీరునితో, రథికుడు రథికునితో, పదాతులు పదాతులతో, ఈ విధముగా వీరులు తమతో సమానమగు స్థితిలోనున్న శత్రువీరులతో గొప్ప యుద్ధము చేసిరి (22). అపుడు నిశుంభుడు తన

మనస్సులో నిట్లు తలపోసెను : ఇపుడు భయంకరమగు కాలము ఆసన్నమైనది. కాలవైపరీత్యము సంప్రాప్తమైనప్పుడు దరిద్రుడు గొప్ప ధనవంతుడగును. గొప్ప ధనికుడు దరిద్రుడుగను అగుదురు (23).

జడో భ##వేత్ స్ఫీతమతిర్మహామతిర్జడో నృశంసో బహుమంతు సంస్తుతః |

పరాజయం యాంతి రణ  మహాబలా జయంతి సంగ్రామముఖే చ దుర్బలాః || 24

జయోऽజయో వా పరమేశ్వరేచ్ఛయా భవత్యనాయాసత ఏవ దేహినామ్ |

న కాలముల్లంఘ్య శశాక జీవితుం మహేశ్వరః పద్మజనీ రమాపతిః || 25

ఉపేత్య సంగ్రామసుఖం పలాయనం న సాధు వీరా హృదయేऽనుమన్వతే |

పరం తు యుద్ధే కథమేతయా జయో వినాశితం మే సకలం బలం యథా || 26

ఇయం హి నూనం సురకర్మ సాధితుం సమాగతా దైత్యబలం చ బాధితుమ్ |

పురాణమూర్తిః ప్రకృతిః పరా శివా న లౌకికీయం వనితా కదాపి వా || 27

వధోऽపి నారీవిహితోऽయశస్కరః ప్రగీయతే యుద్ధరసం లిలిక్షుభిః |

తథాప్యకృత్వా సమరం కథం ముఖం ప్రదర్శయామోऽసురరాజసన్నిధౌ || 28

విచారయిత్వేతి మహారథో రథం మహాంతమధ్యాస్య నియంతృ చోదితమ్ |

య¸ం ద్రుతం యత్ర మహేశ్వరాంగనా సురాంగనాప్రార్థిత¸ంవనోద్గమా || 29

అవోచదేనాం స మహేశి కిం భ##వేదేభిర్హతైర్వ్రతనజీవిభిర్బలైః |

తవాస్తి కాంక్షా యది యోద్ధుమావయోస్తదా రణస్స్వార్ధృతయుద్ధసత్వబలైః || 30

ఉవాచ కాలీం ప్రతి కౌశికీ తదా సమీక్ష్యతామేష దురాగ్రహో%నయోః |

కరోతి కాలో విపదాగమే మతిం విభిన్నవృత్తిం సదసత్ప్రవర్తకః || 31

తతో నిశుంభో%భిజఘాన చండికాం శ##రైస్సహస్రై#్రశ్చ తథైవ కాలికామ్ |

బిభేద బాణానసురప్రచోదితాన్ సహస్రఖండం స్వవరోత్కరైశ్శివా || 32

తతస్సముత్థాయ కృపాణముజ్జ్వలం స చర్మ కంఠీరవమూర్ధ్న్యతాడయత్ |

బిభేద తం చాపి మహాసినాంబికా యథా కుఠారేణ తరుం తరుశ్చిదః || 33

స భిన్నఖడ్గో నిచఖాన మార్గణం పరాంబికావక్షసి సో%పి చిచ్ఛిదే |

పునస్త్రిశూలం హృదయే%క్షిపత్తదప్యచూర్ణయన్ముష్టిని పాతనేన సా || 34

గదాం సమాదాయ పునర్మహారథో%భ్యధావదంబాం మరణోన్ముఖో%సురః |

అచూర్ణయత్తామపి శూలధారయా పునస్త్రిశూలం విదదార సో%న్యయా || 35

తతోంబికా భిమభుజంగమోపమై స్ఫురద్విషాం శోణితచూషణోచితైః |

నిశుంభమాత్మీయశిలీముఖైశ్శితైర్నిహత్య భూమీమనయద్విషోక్షితైః || 36

కాలవైపరీత్యము వచ్చినప్పుడు మూర్ఖుడు మహాబుద్ధిశాలియగును. మహాబుద్ధిశాలి మూర్ఖుడగును. క్రూరుడు మహాత్ముల ప్రశంసలనందుకొనును. మహాబలశాలురు యుద్ధములో పరాజితులై, బలహీనులు విజయమును పొందెదరు (24). ప్రాణులకు జయపరాజయములు పరమేశ్వరుని ఇచ్చచే మాత్రమే అనాయాసముగా లభించుచుండును. బ్రహ్మ విష్ణుమహేశ్వరులైననూ కాలమునతిక్రమించి జీవించలేరు (25). యుద్ధరంగమునకు వచ్చి వెనుకకు దిరుగుట మంచి పని కాదు. అట్టి పనిని వీరులు తమ హృదయములో ఆమోదించరు. కాని యుద్ధములో ఈమెను జయించుట యెట్లు? నా సైన్యమంతయు వినాశమును పొందినది (26). ఇది నిశ్చితముగా దేవతల పనియే. సనాతన ప్రకృతి, పరాభట్టారిక అగు శివాదేవి రాక్షససైన్యమును పీడించి దేవకార్యమును సిద్ధింపజేయుటకు వచ్చియున్నది. ఈమె నిస్సందేహముగా సామాన్య స్త్రీ కాదు (27). యుద్ధమును ప్రేమించే వీరులు స్త్రీ హత్య అపకీర్తిని ఇచ్చునని నొక్కి చెప్పుచున్నారు. కాని, యుద్ధమును మానివేసినచో, రాక్షసచక్రవర్తి సమక్షములో ముఖమును ఎట్లు చూపించగలము? (28) మహారథుడగు నిశుంభుడు ఈ విధముగా తలపోసి సారథిచే నడుపబడే గొప్ప రథమునెక్కి, దేవతాస్త్రీలు కూడ కోరదగిన ్రివనప్రాభవము గల ఆ మహేశ్వరపత్నియగు శివాదేవి ఉన్న స్థానమునకు వేగముగా వెళ్లెను (29). ఆతడు ఆమెతో నిట్లనెను : ఓ మహేశ్వరీ ! జీతముతో బ్రతికే ఈ భటులను సంహరించినచో నేమగును? నీకు యుద్ధమును చేయవలెననే ఆకాంక్ష ఉన్నచో, యుద్ధమునకు ఉచితమగు చక్కని వస్త్రములను దాల్చియున్న

మనము ఇద్దరము యుద్ధమును చేసెదము గాక ! (30) అపుడా కౌశికి అను పేరు గల కాళి ఇట్లు పలికెను : వీరిద్దరి మూర్ఖపు పట్టుదలను చూచి తీరవలసినదే. ధర్మాధర్మములను ప్రవర్తిల్లజేయు కాలము, ఆపద సంప్రాప్తమైనప్పుడు జీవుని బుద్ధిని తప్పుద్రోవ పట్టించును (31). అపుడు నిశుంభుడు భయంకరాకారయగు కాళిని వేలాది బాణములతో అంతటా కొట్టెను. ఆ శివాదేవి రాక్షసునిచే ప్రయోగింపబడిన బాణములను తన బాణపరంపరలను గుప్పించి వేయి వేయి ముక్కలుగా చేసెను (32). అపుడాతడు లేచి నిలబడి మిరిమిట్లు గొలిపే కత్తిని డాలును పట్టుకొని, ఆకత్తితో విరుగగొట్టెను (33). విరిగిన కత్తి గల ఆ నిశుంభుడు ఆ జగన్మాతయొక్క వక్షఃస్థలమును బాణముతో గ్రుచ్చెను. ఆ బాణము కూడ విరిగిపోయెను. ఆతడు మరల త్రిశూలమును ఆమె హృదయముపై ప్రయోగించగా, ఆమె దానిని కూడ పిడికిలితో కొట్టి నుగ్గు చేసెను (34). మరణమునకు అభిముఖుడై యున్న మహారథుడగు ఆ రాక్షసుడు మరల గదను చేతబట్టి జగన్మాత పైకి పరుగెత్తగా, ఆమె దానిని తన శూలము యొక్క పదునైన అంచుతో పొడి చేసెను. అపుడాతడు మరియొక గదతో మరల ఆమె త్రిశూలమును విరుగగొట్టెను (35). అపుడు అంబిక భయంకరమగు పాములను పోలియున్నవి, రాక్షసుల రక్తమును త్రాగుటకు సమర్థములైనవి, విషము పూయబడినవి అగు తన వాడి బాణములతో నిశుంభుని కొట్టి నేల గూల్చెను (36).

నిపాతితే%మానబలే%సురప్రభుః కనీయసి భ్రాతరి రోషపూరితః |

రథస్థితో బాహుభిరష్టభిర్వృతో జగామ యత్ర ప్రమదా మహేశితుః || 37

అవాదయచ్ఛంఖమరిందమం తదా ధనుస్స్వనం చాపి చకార దుస్సహమ్ |

ననాద సింహో%పి సటాం విధూనయన్ బభూవ నాదత్రయనాదితం నభః || 38

తతో%ట్టహాసం జగదంబికా%కరోద్వితత్రసుస్తేన సురారయో%ఖిలాః |

జయేతి శబ్దం జగదుస్తదా సురా యదాంబికోవాచ రణ    స్థిరో భవ || 39

స దైత్యరాజో మహతీం జ్వలచ్ఛిఖాం ముమోచ శక్తిం నిహతా చ సోల్కయా |

బిభేద శుంభప్రహితాన్ శరాన్ శివా శివేరితాన్ సో%పి సహస్రధా శరాన్ || 40

త్రిశూలముత్ క్షిప్య జఘాన చండికా మహాసురం తం స పపాత మూర్ఛితః |

విభిన్నపక్షో హరిణా యథా నగః ప్రకంపయన్ ద్యాం వసుధాం స వారిధిమ్ |. 41

తతో మృషిత్వా త్రిశిఖోద్భవాం వ్యథాం విధాయ బహూనయుతం మహాబలః |

స కాలికాం సింహయుతాం మహేశ్వరీం జఘాన చక్రై రమరక్షయంకరైః || 42

తదస్తచక్రాణి విభిద్య లీలయా త్రిశూలముద్ఘూర్య జఘాన సాసురమ్ |

శివా జగత్పావనపాణిపంకజాదుపాత్తమృత్యో పరమం పదం గతౌ || 43

హతే తస్మిన్మహావీర్యే నిశుంభే భీమవిక్రమే | శుంభే చ సకలా దైత్యా వివిశుర్బలిసద్మని || 44

భక్షితా అపరే కాలీ సింహాద్యైరమరద్విషః | పలాయితాస్తథాన్యే చ దశదిక్షు భయాకులాః || 45

బభూవుర్మార్గవాహిన్యస్సరితస్స్వచ్ఛపాథసః | వవుర్వాతాస్సుఖస్సర్వా నిర్మలత్వం య¸° నభః || 46

పునర్యాగస్సమారేభే దేవైర్బ్రహ్మర్షిభిస్తథా | సుఖినశ్చాభవన్ సర్వే మహేంద్రాద్యా దివౌకసః || 47

పవిత్రం పరమం పుణ్యముమాయాశ్చరితం ప్రభో | దైత్యరాజవధోపేతం శ్రద్ధయా యస్సమభ్యసేత్ || 48

స భుక్త్వేహాఖిలాన్ భోగాన్ త్రిదశైరపి దుర్లభాన్ | పరత్రోమాలయం గచ్ఛేన్మహామాయా ప్రసాదతః || 49

ఏవం దేవీ సముత్పన్నా శుంభాసురనిబర్హిణీ | ప్రోక్తా సరస్వతీ సాక్షాదుమాంశావిర్భవా నృప || 50

ఇతి శ్రీ శివమహాపురాణ ఉమాసంహితాయాం నిశుంభశుంభవధో నామ అష్టాచత్వారింశో%ధ్యాయః (48).

అంచనా వేయ శక్యము కాని బలము గల తన తమ్ముడు నేలకూలగా రోషముతో నిండియున్న రాక్షసరాజగు శుంభుడు ఎనిమిది బాహువులు గలవాడై రథమునందున్నవాడై మహేశ్వరపత్ని ఉన్న స్థానమునకు వెళ్లెను (37). అపుడాతడు శత్రువులకు పీడను కలిగించే శంఖధ్వనిని చేసి, సహింప శక్యము కాని విధముగా ధనుష్టంకారమును చేసెను. సింహము కూడ జూలును విదల్చి నాదమును చేయగా, ఆ ముడు ధ్వనులతో ఆకాశము మారుమ్రోగెను (38). అపుడా జగన్మాత అట్టహాసమును చేయగా, రాక్షసులందరు చాల భయపడిరి. అపుడు దేవతలు జయధ్వనులను చేసిరి. అపుడు అంబిక, 'యుద్ధములో స్థిరముగా నిలబడుము' అని పలికెను (39). ఆ రాక్షసరాజు జ్వాలలతో ప్రకాశించే పెద్ద శక్తిని ప్రయోగించెను. అది ఉల్కచే భగ్నము చేయబడెను. శివాదేవి శుంభునిచే ప్రయోగించబడిన బాణములను విరుగగొట్టెను. ఆతడు కూడ ఆమెచే ప్రయోగింపబడిన బాణములను వేయి వేయి ముక్కలుగా చేసెను

(40). అపుడా చండిక త్రిశూలమును పైకెత్తి ఆ గొప్ప రాక్షసుని కొట్టగా, ఆతడు మూర్ఛిల్లి క్రింద పడెను. ఇంద్రునిచే రెక్కలు తెగగొట్టబడిన పర్వతము వలె ఆతడు క్రింద బడగానే, సముద్రముతో కూడిన భూమి మరియు స్వర్గలోకము కూడ అధికముగా కంపించెను (41).అపుడా మహాబలుడగు రాక్షసుడు త్రిశూలపు దెబ్బవలన కలిగిన నొప్పికి తట్టుకొని పదివేల బాహువులు గలవాడై దేవతలను వినాశమొనర్చే చక్రములతో మహేశ్వరియగు కాళికను, మరియు సింహమును కొట్టెను (42). వానిచే ప్రయోగించబడిన చక్రములను అవలీలగా విరుగకొట్టి ఆ శివాదేవి త్రిశూలమును పైకెత్తి ఆ రాక్షసుని దానితో సంహరించెను. లోకములను పవిత్రము చేసే, పద్మముల వంటి ఆమె చేతులలో ప్రాణములను విడిచిన ఆ రాక్షసులిద్దరు మోక్షమును పొందిరి (43). మహాబలుడగు ఆ నిశుంభుడు, మరియు భయంకరమగు పరాక్రమముగల శుంభుడు సంహరింపబడగానే, రాక్షసులందరు బలియొక్క గృహము (పాతాళము) ను ప్రవేశించిరి (44). కాళి, సింహము మొదలగు వారు కొందరు రాక్షసులను భక్షించిరి. మరికొందరు భయముచే కంగారుపడి పదిదిక్కులకు పారిపోయిరి (45). నదులు స్వచ్ఛజలములు గలవై తమ మార్గములో ప్రవహింపజొచ్చినవి. వాయువులు సుఖమగు స్పర్శ కలుగునట్లు వీచినవి. ఆకాశము నిర్మలమయ్యెను (46). దేవతలు మరియు బ్రహ్మర్షులు మరల యజ్ఞములను చక్కగా ఆరంభించిరి. ఇంద్రుడు మొదలగు దేవతలందరు సుఖమును పొందిరి (47). ఓ రాజా ! పావనము, పుణ్యప్రదము, రాక్షసరాజుల వధ అనే వృత్తాంతముతో కూడియున్నది అగు ఉమాదేవీ చరిత్రను ఎవడైతే శ్రద్ధతో చక్కగా అభ్యసించునో (48), వాడు ఇహలోకములో దేవతలకు కూడ లభింప శక్యము కాని భోగముల నన్నిటినీ అనుభవించి , మరణించిన పిదప మహామాయా స్వరూపిణియగు ఉమయొక్క అనుగ్రహముచే ఆమె యొక్క ధామమును పొందును (49). ఓ రాజా ! ఈ తీరున శుంభాసురుని సంహరించిన సరస్వతీదేవి సాక్షాత్తుగా ఉమయొక్క అంశ##యై ఆవిర్భవించినదని చెప్పబడెను (50).

శ్రీ శివమహాపురాణములోని ఉమాసంహితయందు శుంభనిశుంభవధ అనే నలుబది ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (48).